# వాడిపోని వసంతాలు

జె. బాపురెడ్డి

జయం పబ్లికేషన్స్
హైదరాబాదు

**Vaadiponi Vasantaalu - Telugu Poetry**
*(Unfading Springtimes)*
by
**Dr. J. Bapu Reddy**
Plot 10, Road 5
Jubilee Hills
Hyderabad - 500 034. India.

*Dedicated to*
***Dr. P.V. Narasimha Rao,***
*Prime Minister of India.*

World Copy Right 1992 ©

Rs. 30.00
US$ 5.00

*Cover design :* **Gopi**

*Published by*
**Jayam Publications**
Plot 10, Road 5, Jubilee Hills
Hyderabad - 500 034
A.P., India.

*Printed at*
**Vipla Computer Services**
Nallakunta, Hyderabad - 500 044.
Phone: 66 74 76.



కృతి కర్త　　　　　　　　　　కృతి స్వీకర్త

సాహితీ బంధువు

విజ్ఞాన ప్రజ్ఞాన సింధువు

భారత జాతి ఆశాజ్యోతి

మన ప్రియతమ ప్రధాని

గౌ॥ డా. పి.వి. నరసింహారావు గారికి

అత్యంత ప్రేమాభిమాన పుష్పగుచ్ఛంగా

ఈ "వాడిపోని వసంతాలు"

అంకితం

# అంకితం

కరీంనగర మండలంలో పుట్టిన
కారణజన్ముడవు నీవు
తెలుగు తల్లి ఒడిలో పెరిగిన
తేజశ్శిఖరం నీవు
ఓరుగల్లు నుదుటిమీద వెలసిన
భారత జాతి అదృష్ట జాతకచక్రం నీవు
ఎర్రకోట పూరించిన
ప్రజావిజయ శంఖం నీవు
విజ్ఞాన ప్రజ్ఞాన సింధువులో
వేయిపడగలెత్తిన
సత్య సాహిత్య చేతనం నీవు
బమ్మెర పోతన స్వాతంత్ర్య దీక్షను
భావించే భాషాంబర కేతనం నీవు -
వేల్పుల కీర్తి మూర్తిగొన్న
పాములపర్తి వేంకట నరసింహారావు నీవు -

పెరంబుదూరులో అమానుషత్వం
ఫెళ్ళున ప్రేలినప్పుడు
రాగం పండే దేశం నిండా
రక్తం చిందినప్పుడు
జనజీవన రాజీవం
కటిక చీకటి వ్యూహానికి బలియైనప్పుడు
మేలుకొన్న ఆశాస్వప్నానివి నీవు
హిరణ్యాక్ష వరాలు పొందిన
హింసారాక్షసత్వాన్ని

కొనగోటితో చీల్చివేసిన
ఎనలేని నరసింహత్వానివి నీవు
ప్రమాదాలు దాడిచేసిన ప్రజాస్వామ్య ప్రహ్లాదుణ్ణి
పరిరక్షించిన ప్రజ్ఞాశక్తియుక్తి రూపం నీవు
సమతా మానవతా ధర్మహర్మ్య దీపం నీవు
సమ్యక్ సమైక్య భారత సారథివి నీవు
విభిన్న అభిమతాలమధ్య
సయోధ్యారామ సత్య మందిరం నీవు
భక్తిజ్ఞాన కర్మయోగివి నీవు
సదాలోచనా భోగివి నీవు
అమ్లాన ప్రగతి రచనోద్యోగివి నీవు
నిత్యయౌవన వసంతుడవు నీవు
అందుకే అంకితం నీకు
ఈ "వాడిపోని వసంతాలు"
ఏనాటికి వీడిపోని
ప్రేమభావలతాంతాలు

— జె. బాపురెడ్డి

# వాడిపోనివి, వీడిపోనివి

'వందే వాల్మీకి కోకిలమ్' - అని ఆదికవిని స్మరించి నమస్కరిస్తాం. అందుకు రెండు కారణాలున్నాయి. ఒకటి. అతడు పుట్టలోనుండి పుట్టాడని; రెండు - అతడు కోకిల వంటి వాడని. పుట్టలో నుండి పుట్టటంలో పుట్టెడర్థాలున్నాయి. అన్నీ అలా ఉంచి - అతడు తపస్సు చేసి తత్వాన్ని దర్శించాడు. పుట్టనుండి లేచినప్పుడు అతడు నవ్యదర్శనంతో పుట్టాడు. దర్శనం కలవాడు ద్రష్ట. వాల్మీకి ద్రష్ట. అతడు ఆదికవి అయ్యాడు. దర్శనాన్ని కవితగా మార్చి సృష్టించగలవాడు స్రష్ట. కాకిగూట్లో పెరిగినా కోకిల తన సొంత గొంతును విప్పి తన అస్తిత్వాన్ని నిరూపించుకొంటుంది. కోకిల పంచమస్వరం వసంతోదయగీతం. వసంతం అంటే - ఒక దర్శనం. ఒక సృజనంగా పరిణమించిన అభివ్యక్తికి ప్రతీక. అటువంటి అభివ్యక్తి యొక్క ఆవిష్కృతిని గుర్తించి అనుభవించే సంకేతం లౌకికంగా చెప్పుకొంటే ఉగాది; సాహితీక్షేత్రంలో యుగాది. అభినవావిష్కారాన్ని రసిక హృదయాలకు పంచి పెట్టే పర్వకాలం వసంతోత్సవం. అందువల్లనే కవులు ఉగాదులన్నా, కోకిలలన్నా, వసంతఋతువులన్నా, వసంతోత్సవాలన్నా బాహిరంగా కంటే అంతరంగికంగా, రసజగత్తులో రమించే ప్రతీకాత్మక ప్రవృత్తిని ప్రదర్శిస్తూ ఉంటారు.

ఉగాదిని గురించి గాని, కోకిలను గురించి గాని, వసంతాలను గురించి గాని కవితలు వ్రాయని కవి సామాన్యంగా ఉండడు. ఉంటే అతడు పుట్టలోనుండి పుట్టినవాడు కాకపోయి ఉండాలి. దార్శనిక స్వభావం లోపించి ఉండాలి. కొందరు ఉగాదులను గురించి వ్రాసిన కవులను అధిక్షేపిస్తారు; ఉగాది కవులను ద్వేషిస్తారు కూడా; వసంతాలను వెక్కిరిస్తారు; వసంతగానం చేసే వారికి సామాజిక వాస్తవికత లోపించినట్లు వ్యాఖ్యానిస్తారు. సామ్యవాదులు సాహిత్యాన్ని విమర్శించే పద్ధతిలో ఇది ఒక ధోరణి. అయితే వాళ్లంటున్న మాటల్లో ఒక మర్మం ఉంది. ఉగాదిని గాని, కోకిలను గాని, వసంతాన్ని గాన్ని , మార్క్సిస్టు దృక్పథంతో చూచి వర్ణించమంటారు. అప్పుడు ఉగాది కవిత్వం వ్రాసినా అభ్యుదయకవిత్వమౌతుందని అన్వయిస్తారు. ఏ దృక్పథమూ లేకుండా యాంత్రికంగా ఉగాదినీ, కోకిలనూ, వసంతాన్నీ, వర్ణిస్తే వాళ్ళను పొట్టి ఉగాది కవులనటంలో కొంత ఔచిత్యముంది. కాని, మార్క్సిస్టు పుట్టలో నుండి పుట్టినవాడే కవి అన్నా కుదరదు; మార్క్సిస్టేతర దర్శనాలు పుట్టలు కావన్నా అర్థం ఉండదు. అందువల్ల ఉగాదిని గాని, కోకిలను గాని, వసంతాన్ని గాని వర్ణించినప్పుడల్లా ఒక దార్శనిక భిత్తికను కవి సంతరించుకుని సృజిస్తే అది 'వాల్మీకి కోకిల' వంటి వాఙ్మయసృష్టి అవుతుందని తాత్పర్యం.

'వాడిపోని వసంతాలు', 'వాల్మీకి కోకిల' లాగా బాపురెడ్డి గారు 'పలికిన కవితలు. ఇందులోని వసంతాలు ఋతువులే కాదు. ఉగాదులు, వసంతకాలానికి సంబంధించిన అనుభూతులు. ఇవి కవిసమ్మేళనాల కోసం కుస్తీ బట్టి వ్రాసిన కవితలు కావు. కాలానికి స్పందించి కమనీయంగా ఆలపించినవి. వసంతం బాపురెడ్డిగారికి కవి సమయాల సంపుటం కాదు. కవి ఆయాసమయసందర్భాలలో పొందిన స్పందనల సాహితీ వ్యక్తీకరణం. బాపురెడ్డి గారి దృక్పథంలో కాలఖండగణనం అఖండ కాల దర్శనంలో ఒక తరంగం మాత్రమే. అనంత సత్యం బాపురెడ్డి గారి దార్శనిక వల్మీకం. ప్రతి వస్తువులో ఒక దార్శనిక సత్యాన్ని ఆత్మగా అనుభవించి దానిని కేంద్రంగా చేసికొని భావనాశబలతను ప్రపంచిస్తూ ఉంటారు బాపురెడ్డి గారు. వారి దృష్టిలో దార్శనిక సత్యమే వస్తునిష్ఠమైన వాస్తవం. ఆదర్శనం నుండి పుట్టిన సృజనమే కావ్యం-లేదా-ఖండ కావ్యం. వసంతాలు వాడిపోకుండా దర్శనంలో భద్రపరుస్తాడు కవి. ఒకే ఉగాది ప్రతి యేడాది వస్తుంది. కవి, స్పందించి ఉగాదిని వర్ణిస్తాడు. పేర్లు మారినా, ఉగాది స్వభావం ఒకటిగా కీర్తించటం యాంత్రికం. పేర్లతోపాటు స్వభావం మారినట్లు కల్పించటం మాంత్రికం. ఈ రెంటింటినీ బాపురెడ్డి గారు హర్షించరు. ఒక్కొక్క ఉగాదిని, వసంతాన్ని ఒక్కొక్క సత్యదర్శనంతో వ్యాఖ్యానించటం తమ ప్రత్యేకతగా సాధించారు.

మధుమాసం బాపురెడ్డి గారి కవితలో మందహాసంగానే ఉంటుందని చెప్పలేం. ఆ యేడు ప్రపంచం, భారతభూమి, ఆంధ్రప్రదేశ్ - స్పందించే సందర్భాన్ని బట్టి కవి సత్యదర్శనం కవితను సృజిస్తుంది. ఒక వసంతం ఎలా అనిపించిందో చూడండి -

"మోసం మధుమాసంలా
వేషం వేస్తుందనుకోలేరు" ..... అంటూ మొదలు పెట్టి

*"అడవులారా! కొండలారా!*
*అజ్ఞాతపు లోయల గుండెలారా!*
*ఈ విద్వేషపలాశ కుసుమ హాసం నమ్మకండి*
*ఈ మధుమాసపు మోసంలో పడకండి*
*మనషిని చంపి మనిషిని బ్రతికిస్తామనే*
*మాయలో చిక్కకండి!*
*అడిగితే కూడా పెట్టదనే అపోహతో*
*అమ్మ రొమ్ము చీల్చకండి!*
*ఓట్ల చెట్టు మీద పూయవలసిన పూలు*

బుల్లెట్ల మీద పూస్తాయా!
సదాలోచనలకు సాధ్యమయ్యే వెలుతురు
దురావేశానికి దొరుకుతుందా!
పికాల బాకాలు చిలికే స్వరాలు
తుపాకి గుండ్లు పలికిస్తాయా!" - అని సాగుతుంది.

హింసా రాజకీయాలను, సాయుధ విప్లవాలను గర్హించే బాపూ దర్శనం బాపురెడ్డి గారి కవితాభివ్యక్తికి జన్మనిచ్చిన వల్మీకం. బాపురెడ్డి గారు ప్రతి వసంతాన్నీ ప్రత్యేకంగా దర్శించారు. విశేషంగా వ్యక్తీకరించారు. అందువల్లనే అవి వాడిపోనివి, రాలిపోనివి. కలకాలం సహృదయలోకం మనసుల్లో భద్రపరుచుకోవలసినవి.

బాపురెడ్డి గారి వసంతాలన్నీ ఈ కవితాసంపుటిలో గుబాళిస్తున్నాయి. కోకిలల్లాగా ప్రతీకలు; తుమ్మెదల్లాగా బింబాలు; తేనేటీగల్లాగా అలంకారాలు; పూలలాగా భావనలు; తావిలాగా శైలీ విన్యాసాలు అక్షరానుభవాన్నివ్వగలిగే కవితా ఖండికలు. ఒక్కొక్క ఖండికలో ఒక వల్మీకంలో నుండి పుట్టిన అనుభవ దర్శనం; ఒక అభివ్యక్తినందుకొన్న అపూర్వ కవితా శిల్పం!

డాక్టర్ బాపురెడ్డి గారు దార్శనికులు కాబట్టి వసంతాలు వాడిపోవు! దశాబ్దాల తరబడి కవితలు వ్రాస్తున్న బాపురెడ్డి గారి కవితా భావనలో ఎప్పటికప్పుడు అభినవమైనదైనా ఒక అవిచ్ఛిన్నత ఉండటం చేత ఈ వసంతాలు ఎన్నటికీ వీడిపోవు!!

ఇప్పటి స్నేహమా మా యిద్దరిది. నలభై వసంతాలు నడిచివచ్చాం. అయినా అలసి పోలేదు. అప్పటి నుండీ చూస్తున్నాను కవిగా బాపురెడ్డిగారిని. మాటలో, తీరులో, స్నేహంలో, భావనంలో, కవితలో, నవతలో, ఎప్పుడూ ఆయన వాడిపోనీ వసంతమే! అలాగే మా స్నేహం కూడా వాడిపోనిది, వీడిపోనిదీ! అందుకే ఈ అక్షరబంధం!

భారతజాతికి ఆశాజ్యోతిగా వెలుగుతున్న తెలుగుబిడ్డ, సాహిత్యతత్వ దార్శనికులు భారతప్రధాని డా॥ పి.వి. నరసింహరావు గారికి ఈ పుస్తకం అంకితం కావడం ఒక్క బాపురెడ్డికే కాదు యావద్భారత దేశంలోని సాహిత్యకారులకు ముఖ్యంగా కవులకు ఆయన పట్ల ఉన్న అత్యంత గౌరవపూర్వకమైన ప్రేమాభిమానాలకు ప్రబల తార్కాణం.

డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం
తెలుగు ప్రొఫెసర్ &
డీన్. స్కూల్ ఆఫ్ హ్యూమానిటీస్
హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం

బుల్లెట్ల మీద పూస్తాయా!
సదాలోచనలకు సాధ్యమయ్యే వెలుతురు
దురావేశానికి దొరుకుతుందా!
పికాల బాకాలు చిలికే స్వరాలు
తుపాకి గుండ్లు పలికిస్తాయా!" – అని సాగుతుంది.

హింసా రాజకీయాలను, సాయుధ విప్లవాలను గర్హించే బాపూ దర్శనం బాపురెడ్డి గారి కవితాభివ్యక్తికి జన్మనిచ్చిన వల్మీకం. బాపురెడ్డి గారు ప్రతి వసంతాన్నీ ప్రత్యేకంగా దర్శించారు. విశేషంగా వ్యక్తీకరించారు. అందువల్లనే అవి వాడిపోనివి, రాలిపోనివి. కలకాలం సహృదయలోకం మనసుల్లో భద్రపరుచుకోవలసినవి.

బాపురెడ్డి గారి వసంతాలన్నీ ఈ కవితాసంపుటిలో గుబాళిస్తున్నాయి. కోకిలల్లాగా ప్రతీకలు; తుమ్మెదల్లాగా బింబాలు; తేనేటీగల్లాగా అలంకారాలు; పూలలాగా భావనలు; తావిలాగా శైలీ విన్యాసాలు అక్షరానుభవాన్నివ్వగలిగే కవితా ఖండికలు. ఒక్కొక్క ఖండికలో ఒక వల్మీకంలో నుండి పుట్టిన అనుభవ దర్శనం; ఒక అభివ్యక్తినందుకొన్న అపూర్వ కవితా శిల్పం!

డాక్టర్ బాపురెడ్డి గారు దార్శనికులు కాబట్టి వసంతాలు వాడిపోవు! దశాబ్దాల తరబడి కవితలు వ్రాస్తున్న బాపురెడ్డి గారి కవితా భావనలో ఎప్పటికప్పుడు అభినవమైనదైనా ఒక అవిచ్ఛిన్నత ఉండటం చేత ఈ వసంతాలు ఎన్నటికీ వీడిపోవు!!

ఇప్పటి స్నేహమా మా యిద్దరిది. నలభై వసంతాలు నడిచివచ్చాం. అయినా అలసి పోలేదు. అప్పటి నుండీ చూస్తున్నాను కవిగా బాపురెడ్డిగారిని. మాటలో, తీరులో, స్నేహంలో, భావనంలో, కవితలో, నవతలో, ఎప్పుడూ ఆయన వాడిపోనీ వసంతమే! అలాగే మా స్నేహం కూడా వాడిపోనిది, వీడిపోనిదీ! అందుకే ఈ అక్షరబంధం!

భారతజాతికి ఆశాజ్యోతిగా వెలుగుతున్న తెలుగుబిడ్డ, సాహిత్యతత్వ దార్శనికులు భారతప్రధాని డా॥ పి.వి. నరసింహరావు గారికి ఈ పుస్తకం అంకితం కావడం ఒక్క బాపురెడ్డికే కాదు యావద్భారత దేశంలోని సాహిత్యకారులకు ముఖ్యంగా కవులకు ఆయన పట్ల ఉన్న అత్యంత గౌరవపూర్వకమైన ప్రేమాభిమానాలకు ప్రబల తార్కాణం.

డాక్టర్ జి.వి. సుబ్రహ్మణ్యం
తెలుగు ప్రొఫెసర్ &
డీన్, స్కూల్ ఆఫ్ హ్యుమానిటీస్
హైదరాబాదు కేంద్ర విశ్వవిద్యాలయం

ఆత్మీయులు సిద్ధసాహిత్య శిఖరవాసి డా. జి.వి.సుబ్రహ్మణ్యం గారికి నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. ఆయన అమృతవాక్కులు సాహిత్యచరిత్రలో వెలిగే బుక్కులు. ఖండ ఖండాంతరాలలో తెలుగు విజ్ఞానదీప్తికి కంకణం కట్టుకున్న తెలుగు విశ్వవిద్యాలయ కులపతి, భారతీయ సాహిత్య సామ్రాజ్య పీఠికా సన్మానితుడు డా. ఆచార్య సి. నారాయణరెడ్డి గారు నాకు ఇస్తున్న ప్రోత్సాహానికి నేను సర్వదా కృతజ్ఞుణ్ని.

పుస్తకాన్ని రమణీయంగా ముద్రించిన విప్ల కంప్యూటర్ సర్వీసెస్ వారికి, ముఖ్యంగా శ్రీ విజయసేనారెడ్డి గారికి నా ధన్యవాదాలు. నా కవితాత్మను రేఖాచిత్రాలుగా తీర్చిన సృజనశీలి శ్రీ గోపి గారికి నా అభినందన పూర్వక ధన్యవాదాలు. నా కావ్యరచనకు తోడ్పడుతున్న జయం పబ్లికేషన్సు వారికి, ముఖ్యంగా శ్రీ జె. మారుతి గారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు. నా సాహిత్య జీవనధుని, నా సతీమణి శ్రీమతి రాజేశ్వరికి నా ప్రణవానంద ప్రసూనాలు.

జె. బాపురెడ్డి

# ఇందులో

# కాలం పుట్టిన కాలం

భూతకాలం పెరిగినట్టా
భావికాలం తరిగినట్టా
కొత్త సంవత్సరం రావటం అంటే
ఏమిటి జరిగినట్టు?

సృష్టి జీవిత ప్రాంగణం నుండి
ఊడ్చి వేయబడుతున్న
ఈ అబ్దాలు, దశాబ్దాలు, శతాబ్దాలు, యుగాలు
ఎక్కడ పూడ్చివేయబడుతున్నాయి?
అంతం లేని కాలం
అఖండ ధారగా, అనాయాచితంగా
తనను త్రాగేస్తున్న దేశం దోసిటిలోకి
ఎక్కడినుంచి దొరలి పడుతున్నది?

సూక్ష్మాతిసూక్ష్మమైన తన కేంద్ర బిందువు నుంచి
సమానాంతరం పాటిస్తూ
నిరంతరం చంక్రమణం సాగిస్తున్న
పరిధి పరమావధి ఏమిటి?

ఏమిటీ పిచ్చి ప్రశ్నలు !
ఎవరు ఎవర్ని అడుగుతున్న
ఇరకాటపు ప్రశ్నలివి !
వచ్చిపోయే వత్సరాలు
ఎక్కడినుంచి వస్తున్నాయో,
ఎక్కడికి పోతున్నాయో
ఎవరికైనా తెలుసేమోనని
ఇప్పుడిప్పుడే 'అక్షరాభ్యాసం' చేస్తున్న
ఈ అర్భకుడు అడుగుతున్న ప్రశ్నలివి.

అర్థం కాకపోయినా
అడగటం తప్పు కాదని అడుగుతున్నాను
ప్రత్యుత్తరం దొరక్కపోయినా
కనీసం ప్రశ్నలైనా
సరిగ్గా వేయడానికి ప్రయత్నిస్తున్నాను.

వెడలిపోతున్న ఏడాదికి
మంచు పూల మాల వేసి
వీడ్కోలు చెపుతున్నాను
చేరవస్తున్న సంవత్సరానికి
వెచ్చని ఆశల గుచ్ఛం అందించి
స్వాగతం పలుకుతున్నాను
కాలం ఏ కాలంలో పుట్టిందో
తెలిసికొనే కాలం
కనుచూపుమేరల్లో ఉన్నట్లు కలలు కంటున్నాను.

●●●

## సంతోదయము

ఈ రసాల వృక్షాల కోయిల గళాలు
సిన సుగానసుధ త్రాగివేసె నేమొ ?
ండు టెండల గ్రీష్మండు బెండు వోవ
ధువుతో పొంగు లెత్తె నామ్రఫలజాతి.

రాగెనో లేదా పసుపుచేలాలు ప్రిదుల
శిర దుశ్శాసనుడు గర్జించి వచ్చి,
చ్చపచ్చని క్రొవ్వలిపమ్ము లురల
నకుమారి వసంతయై పాడె నదిగొ
మురారి మొరాలించెనేమొ కాని.

కరుడు గట్టిన హిమశిలల్ కరిగి ఝురిగ
పారె వాసంత కోష్ణనిశ్వాస లందు
విప్లవోషస్వినీ క్రాంతి వీక్షణాల
కరిగిపారెడు దాస్యాంధకార మట్లు.

విచ్చిన సుమాలు మధువుల వెల్లివిరిసె
భ్రమరయువకాళి ప్రణయగీతముల కరగి
హెచ్చిన వియోగబాధనా ఎద రగుల్ప
భావకవి చేసె నన్నొక దేవి మోవి.

నాడు శిశిరాన ఓదార్చినాడు, ఏడ్చి
నాడు, కవి - జీర్ణ లోకమ్ము చూడలేక :
నేడు వాసంతమున పొంగినాడు పాడి
నాడు శుభగీతి, ముందుండి నాడు నేడు.

●●●

# విప్లవ హాసం

కంటకాల పథముమీద
కదలిపోవు పూలరథము
కొనిపోవును నన్నెవో
క్రొత్త క్రొత్త లోకాలకు---

ఎండమావి మోవిమీద
గున్నమావి రసకేళి
మండే చిరుగాలి ఎదల
మధుమాసము నాటెను---

కనుపించని సత్యపికము
వినిపించే భావరసము
ఆకులేని మాకులపై
అదృష్టము పండించెను---

చేదు బ్రతుకు గతుకలేని
మోదుగు విప్లవహాసం
వెలవెలబోయే ప్రకృతిని
వెలిగించెను రుధిరరుచుల---

# అరవైల ఆటలు

అరవై ముఖాల ఉగాది
కాలాన్ని పాలిస్తున్నది
అరవై అరవై చేతులు ఆడిస్తూ
దేశాన్ని లాలిస్తున్నది--
గడియారం గుడిలో
గంట గంటకు అరవై నిమిషాలు
నిమిష నిమిషపు ఎదతో
స్పందనలు అరవై సెకండ్లు
అవి
కాలాన్ని భజిస్తున్నవి
విభజిస్తున్నవి-
ఒకటి-రెండు-మూడు....
ప్రభవ-విభవ-శుక్ల......
సంఖ్యా భేదం ఉన్నా
సమయమానం ఒకటే
నామభేదం ఉన్నా
కాలరూపమొకటే-

అనంతకాల గర్భంలో
అరవై అరవైల
అకాండ లీలా విలాస కేళిలో
ఆవిర్భవిస్తున్నవి
ఈ ఉగాదులు
ఈ యుగాదులు
ఈ వసంతాలు - వేదాంతాలు
ఈ లతాంతాలు - జీవితాలు

•••

# కోరికలే కోకిలలు

కోరికలు కోకిలలై
కుహూ కుహూ అంటున్నవి
కొండ కోనల్లో
నా గుండె మావుల్లో
ఈ చైత్రోదయవేళ--

ఆశలు కుసుమాలై
ఆవులిస్తున్నవి
చెట్టు చెట్టుపై
నా కనుల గట్టుపై
ఈ వసంతాగమ వేళ--

కలలు రామచిలుకలై
కలకలమని పాడేను
విపినవీధిలో
నా వీనుల గనిలో
ఈ వర్షారంభవేళ--

బ్రతుకే పంచాంగమై
భావిని భావిస్తోంది
ఊరి మూల గుడిలో
నా ఊహల బడిలో
ఈ ఉగాది ఉదయవేళ--

•••

# మార్పే మధుమాసం

మండుడెండల్ని త్రాగేసి
కాలజీమూతాలను ఈదేసి
మధు గీతాలు పాడేసే
శివమెక్కిన కోకిలలు
శిధిలమైన కొమ్మల మీద చివుళ్ళు పండిస్తున్నవి
చీకట్లు కాటువేసిన చెట్లమీద
ఉదయకాంతులు ఆరబోస్తున్నవి
పొగచూరిన మ్రోళ్ళమీద పగడాలు కురిపిస్తున్నవి
తీగెల వేడి నిట్టూర్పుల్లో రంగుల్ని రచిస్తున్నవి -
అవును
ఆ నవపల్లవ తాళవృంతాలు
ఆ లతాంత వేదాంతాలు
ప్రాణం పోస్తున్నవి నా ఊహలకు
రూపం గీస్తున్నవి నా కలలకు -

కొరడాలు విసిరితే కోకిలలు కూయవు
కత్తులు ఝుళిపిస్తే కొమ్మలు విరబూయవు
క్రొత్త ఆలోచనల కోకిల నా హృదయం,
కొత్త అనుభూతుల కొమ్మ నా ఆత్మ,
ప్రగతి పల్లవాలు పల్లవిగా పాడుకోనీయండి దాన్ని
ఆనంద చేతనం కేతనంగా ఆడుకోనీయండి దాన్ని

రాలిపోయే ఆకుల్ని చూచి జాలిపడకు తమ్ముడూ
పారిపోయే నీటిని చూచి పల్లటిల్లకు తమ్ముడూ
ఆకులు రాలితేనే చెట్టు ఎదుగుతుంది

నీరు పారితేనే ఏరు జీవిస్తుంది.
అందుకే
వ్యక్తులు త్యాగంచేసి సమాజాన్ని బ్రతికించాలి
క్షణాలను ధారవోసి యుగాలను నిర్మించాలి -
మధుమాసం మార్పుకు ప్రతినిధి
ఉగాది నవతకు పునాది -
స్వాతంత్ర్య ప్రియత్వానికీ
సమత్వ భావతత్వానికీ
చెట్టు చెట్టుపై గట్టు గట్టుపై
పుష్పాభిషేకం చేస్తున్నది
వాసంత విజయ ఇందిందిర
ఉగాది పర్వేందిర -

ప్రతి చెట్టుకూ పూచే హక్కున్నది
ప్రతి పక్షికీ పాడే హక్కున్నది
అని నిరూపిస్తున్నది ఆమని
జీవన రాగోద్దీప్తనని -
గున్న మామిడి చెట్టులాగ
నాగుండె గుబాళిస్తున్నది
ఉగాది పచ్చడిలాగ
సమైక్యత రుచిస్తున్నది
మట్టిలో దాగిపోయిన పరిమళాలు
మళ్ళీ జీవన పుష్పాలైనవి
నవ చైత్రజైత్రుని అభయ హస్తంతో -
చేదును జీర్ణించుకున్న వేపపూలకు
ఒగరును దిగమ్రింగిన మామిడి పిందెలకు
విందు చేస్తున్నది ఈ ఉగాది - ఊరూరా మనసారా

పొరుగు రాష్ట్రాలతో పోరు తీర్చుకున్న మన నదులు
అస్పృశ్యలై పడియున్న మరుభూములిప్పు
ఆత్మాలింగనం చేసుకొంటున్నవి
అభినందిస్తున్నది ఈ ఉగాది -
పల్లె పల్లెలో పచ్చలతురాయి పెట్టుకొని
అభ్యుదయ వృత్తి విద్యాయుధం పట్టుకొని
దరిద్రతలపై దండెత్తిన ప్రగతిలక్ష్మిని
దీవిస్తున్నది ఈ ఉగాది
చిరకాల వాంఛలు తీర్చే
సిద్ధార్థి ఈ ఉగాది.

●●●

# చైతన్య త్రిశూలం

శూన్య గగనంతో
దైన్యంలా తిరిగిన పక్షులు
ఆశావృక్షాల ఒడిలో
గూళ్ళు కట్టుకుంటున్నవి
రాబోయే వసంతానికి
కాబోయే వారసుల్లా
ఆనందోత్సవం చేసుకుంటున్నవి
నిశ్శబ్దంలో ఆరిపోయిన గొంతుకల్లో
ఆమని మంటలు నింపుకొంటున్నవి
నాచేత నవచేతనాగీతాలు
వ్రాయించుకుంటున్నవి -

మండుటెండల బాధ భరించలేక
మామిడికొమ్మల్లో దాగి
కుహూ కుహూ యని మూల్గిన
కోకిలలు
ఈ నవవాసంత సందీప్తిలో
సమజీవన సుమవీథుల్లో
విప్లవగీతాలు పాడుతున్నవి-

ఆకలి బాకులు పొడిచిన
అడవ కడుపులో నుంచి
చిమ్మిన రక్తపు బిందువులు
ఆ మోదుగుపూలు
శ్రమజీవుల శిధిల జీవితకాశంతో
సౌభాగ్య మధూదయ రేఖలై
క్రొత్తయుగాన్ని పిలుస్తున్నవి

కోనకోనల్లో వెలుగు వరదల్లో
చీకట్లు కొట్టుక పోతున్నవి
రాచిలుకలవలె పలికిన
రాజందులు పారిపోతున్నవి --

ఇన్నాళ్ళు
గంగిరెద్దు వాళ్ళు ఆడించిన
డూడూ బసవన్నలు
జూలు దులిపిన సింహాల్లా
విజృంభిస్తున్నవి.
గుడిసెల మీద గుమ్మడిపూలు
గట్లమీది గడ్డిపూలు
అడవిలోని తుమ్మిపూలు
సత్యం, శివం, సుందరంలా
చైతన్య త్రిశూలంలా రూపిస్తున్నవి
సామాన్యుని సామ్యవాద
శక్తిని నిరూపిస్తున్నవి --

శూన్య సుషుప్తి సమాధులనుండి
చుక్కలు మేల్కొంటున్నాయి
కుటిల కుతంత్రాల కుత్తుకల ప్రేలుస్తూ
శవాలు మేల్కొంటున్నాయి
జిజీవిషలై తాండవిస్తున్నాయి,
తమ జర్జరిత శల్య శలాకలనుండి
విజయ శంఖారావం వినిపిస్తున్నాయి.

కోనకోనల్లో వెలుగు వరదల్లో
చీకట్లు కొట్టుక పోతున్నవి
రాచిలుకలవలె పలికిన
రాబందులు పారిపోతున్నవి --

ఇన్నాళ్ళు
గంగిరెద్దు వాళ్ళు ఆడించిన
డూడూ బసవన్నలు
జూలు దులిపిన సింహాల్లా
విజృంభిస్తున్నవి.
గుడిసెల మీద గుమ్మడిపూలు
గట్లమీది గడ్డిపూలు
అడవిలోని తుమ్మిపూలు
సత్యం, శివం, సుందరంలా
చైతన్య త్రిశూలంలా రూపిస్తున్నవి
సామాన్యుని సామ్యవాద
శక్తిని నిరూపిస్తున్నవి --

శూన్య సుషుప్తి సమాధులనుండి
చుక్కలు మేల్కొంటున్నాయి
కుటిల కుతంత్రాల కుత్తుకల త్రెంపేస్తూ
శవాలు మేల్కొంటున్నాయి
జిజీవిషలై తాండవిస్తున్నాయి,
తమ జర్జరిత శల్య శలాకలనుండి
విజయ శంఖారావం వినిపిస్తున్నాయి.

సాలెగూడు సమాజ వ్యవస్థలో
చిక్కుకున్న అమాయకుల్ని రక్షిస్తూ
సాంఘిక విప్లవం వ్యాపిస్తున్నది
రయీకృత రాజ్యాంగ రథాంగియై
సమ్యక్, సమైక్య సామ్యభారతి
రమణీయ కాంతితీరాలు
చేరుకుంటున్నది.

•••

# ఎన్నికల ఉగాది

వాసంత విశేషాలను
వనరమ వర్ణిస్తున్నది
కుహూ కుహూమని కోకిల
ఊకొడుతూ వింటున్నది .......

ఓటుహక్కు కలవాళ్ళను
పోటీ చేస్తున్న వాళ్ళు
ఎంతో కొనియాడుతున్న
వింతలు వర్ణిస్తున్నది ......

చేసిందేమని అడిగితె
చేయబోవునది చెప్పే
నాయకులను గని ప్రజలు
నవ్వుట వర్ణిస్తున్నది .....

కోటీశుడు కొనజాలని
ఓటువిలువ తెలిసి కొని
గున్న మావులటు పూచిన
గుండెల వర్ణిస్తున్నవి .....

విరుల, గిరుల, ఝరుల వోలె
సిరులు విరిసి, వెలసి, పారు
శిశిరము లేనట్టి భావి
సీమలు వర్ణిస్తున్నది ....

## వసంతరాగం

కోకిల పాటలు
పూవుల తోటలు
నేను నడచిన బాటలలో
నేను నిలిచిన చోటులలో

మామిడి ఫలములు
మధుకర రవములు
నేను తాకిన కొమ్మలలో
నేను ఊపిన రెమ్మలలో --

మ్రోడుల
పువ్వుల మేడలు చేసితి
శిధిలాలకు
నవజీవము పోసితి
నా మధూహల రంగులతో
నా సుగాన సుధాధునితో

కొండలు ప్రాకితి
కొలనులు దూకితి
ప్రతి చెట్టును
ప్రతి లతికను చేరితి
బాధలను తొలగించుటకై
ఆశలను చిగురించుటకై

---

* ( ఋతురాగం - గేయ నాటిక నుండి )

కవితకు కళలకు
కారణమైతిని
ఉగాది నైతిని
యుగాది నైతిని
ఊరూర ఇంటింటికిని
మనిషి మనిషి ప్రతి జీవికిని

నవతకు యువతకు
నవజీవిత
పరువమ్మును తెచ్చిన దేవిని నే --

నింగికి - నేలకు
నిర్మల చాంద్రీ
డోలలు కట్టిన బాలను నే--

కన్నెల మనసుల
కమ్మని తలపుల
మల్లెలు నాటిన బోటిని నే --

అందమ్ముల
ఆనందమ్ముల
జగమంతట పరచిన ఆమని నే

## గ్రీష్మాభియోగం

వాసంతమా ! ఈ
విలాసమేలా ?
విలాసమ్ములో ఇంత
మోస మేలా ?

భాల పల్లవ ఖాదినీ
పికాలాపాల
వికచ పుష్ప పరాగ
మధుపాయి గానాల
మత్తిల్లి పోయె జగ మంత చూడు
మాయలో పడె ప్రకృతికాంత నేడు !

క్షేత్రాలలో
పంటచేలు లేవు
ఝురుల్లలో
జలకాల జాడ లేదు
నవ రసాలోపవన
విజన కాంతారముల
గిరి శిఖాంతర
విహార వినోదివై నీవు
ఎవరికి సుఖాలుకలిగించినావే?
ఇకనైన వేట చాలించి పోవే ?

నా మహా కోప
తాపాగ్నిలో దగ్ధమై
పోక ముందే, వెడలి
పో, కదలి పోవే ।

•••

# సుప్రభాతము

సుప్రభాతము, ఓ వసంత ప్రసూన
వనములార ! ప్రాభాత శోభా ప్రదీప్త
మిత్రులార ! కళా జగచ్చైత్రులార !
ఉజ్జ్వల నవీన వర్ష మహోదయాన
సుప్రభాతము --

ఆ కుసుమిత వనవిలాసినీ కచమ్ము
వోలె నా యెద నాశా సుమాలు పూచె,
పిక లసద్గాన పులకిత ప్రకృతి భంగి
మన్మనము భావ సౌరభ మగ్నమయ్యె.

ఎన్ని వసంతముల్ గడిచె
నెన్ని ఉగాదులు వచ్చి పోవలే
దెన్నడు నాకు ఇట్లువచి
యింపగరాని మహానుభూతి గ
ర్వోన్నతి కల్గలేదు; భర
తోదధి నాంధ్ర మహాతరంగ మి
ట్లెన్నడు అంబరోన్నతి గ
మించుచు పొంగుచు పాడలేదురా !

బాలబాలికలు పుష్పాలవోలె ప్రభాత
వేళ ఆస్యాల హాసాలు నింప
ప్రతి గృహ మ్మొక పల్లవిత మహీరుహ మట్లు
పచ్చ తోరణముల పరిఢవిల్ల
యువతీ యువకులు కలవిహంగముల కిల
కిల లట్లు పరిహాసములను విసర

ప్రతివాడు మలయ మారుత వీచులట్టు లు
జ్జ్వ ల భావి తావి శ్వాసలు వెలార్చ.

ఎటు గనిన రాగ మంగళార్భటి చెలంగ
పటుతరోత్సాహ దివ్య ప్రభలు వెలుంగ
నేడె ఊరూర వనలక్ష్మి నిల్చి యింపు
గా ఉగాది జరుపుకొను కరణి తోచు !

తెల్లని వేపపూ వొగరు
తీరిన మామిడికాయ బెల్లమున్
చల్లని నీట కల్పిన రస
మ్మును దొన్నెల నిండత్రాగి మ
త్తిల్లి సురత్వమొంది నవ
దివ్య వసంత కళావిలాస సం
ఫుల్ల జగత్ ప్రమోద పరి
పూరిత గీతిక లాలపింతమా !

గున్నమామిడి, తన ప్రియకోకిలమ్మ
వీడిపోయి ఆనాడు, తపించి, తిరిగి
సవ్యముగ నేడు కూడి గానమ్ము సేయు
నాంధ్ర తెలంగాన మేకమైనట్టి తమిని.

●●●

# విప్లవ పంచాంగం

అంతరిక్షపు
అతిథియై
ఆనంద పారావారంలో తేలి
నవ జీవన
నక్షత్రంగా వెలుగుతూ
భావ భౌతిక సత్యయోగంలో
కులమత వర్గీకరణమును
కూలద్రోస్తూ
పరిణామ ప్రపంచాంగంగా
ప్రణుతికెక్కుతున్న
భారతదేశానికి జయోస్తు ! ! !
సమతాభావ ప్రాభవాల
 సారధియైన భారతీయుడు
ప్రారంభించిన
ఈవీర విజ్ఞాన విప్లవ పర్వంలో
ఒళ్ళు విరిచి గర్జించే
ప్రజాశక్తి గర్వానికి విజయోస్తు ! ! !



•••

( — గుర్తులు పంచాంగంలోని అయిదు భాగాలను వ్యంజింపజేస్తున్నాయి)

# ఉగాది సరసాలు

తరిగిపోతున్న సరకులు
పెరిగిపోతున్న ధరలు
విరిగిపోతున్న జీవితాలతో
సరసాలాడుతున్నవి
దాగుడుమూతలాడుతున్నవి --

సరకులు తరిగిపోతేనే
ధరలు పెరిగిపోతున్నాయి
కాదు కాదు
ధరలు పెరిగిపోతుంటేనే
సరకులు తరిగిపోతున్నాయి --
చల్లగా తరిగిపోతున్న సరకులను
సామాన్యుడు చేరకుండా
మండిపోతున్న ధరల కుక్కలను
కాపాలా పెట్టారు బేహారులు
సరకులు ముఖ్యం సామాన్యుడికి
ధరలు ముఖ్యం బేహారికి --

అగ్గిలా మండుతున్న ధరలను చూచి
సిగ్గుతో
చీకటి ముసుగు వేసుకుంటున్నాయి సరకులు
ఉత్పత్తి కాలేమంటున్నవి కొన్ని సరకులు
ఉత్పత్తి కామంటున్నవి మరికొన్ని సరకులు
ఉత్పత్తి అయిన సరకులైనా
ఉన్నచోటే ఉండిపోతామంటున్నవి

అవసరమున్న వారి గుమ్మంలో
అడుగు పెట్టమంటున్నవి
గోదాముల్లో గోష్ఠి చేసే
పేదవాళ్ళ పెన్నిధి సరకుల్ని
మత్తేభాల్లాంటి పొగబండ్లు
మోయలేమంటున్నవి.
" కోరికలు తగ్గించుకోండి
కొనడం మానేయండి
చాలు చాలై పోతాయి సరకులు
చెప్పినట్లు వింటాయి ధరలు "
సలహా ఇస్తున్నది ఓ కంఠం.

కోరికల్ని పెంచుకోండి
కొనుగోలు శక్తి పెంచుకోండి
సరకుల ఉత్పత్తిని పెంచండి
అందరకి సమానంగా పంచండి"
ప్రతిపాదిస్తున్నది మరో కంఠం --

ఉన్న సరకుల మధ్య
బాధపడుతున్న వినియోగదారుల మధ్య
వియోగం ఏర్పడింది
వాళ్ళను ఎడబాపే ధరల అఖాతాలపై
వంతెనలను కట్టలేక
వగస్తున్నది సాంఘిక వ్యవస్థ,
పరిష్కారాలు సమస్యలై పోతుంటే
పరితపిస్తున్నది పాలనా వ్యవస్థ,

సామాన్యుడు, నిస్సహాయుడు
విస్తుపోయి కంటున్నాడు
పరిపాలకులు అవస్థలను
తీరని ఆశల బెల్లాన్ని
మారని అనుభూతుల వేపపూవుల్ని
మండే ఆమని చేతులనిండా కాచిన
మామిడి కాయల్ని
తన గుండె చిప్పకుండలో
పచ్చడిచేసి ఇస్తున్నాడు
ఆవేదనల అరణ్యారామునికి
ఆనందనామునికి.

●●●

# రాలిపోయిన శిశిరం

శిశిరంలా ఈసు రాలిపోయింది
వాసంతంలా ప్రేమ విరిసింది –

మండుటెండలకు బెదరక
మావిగుండె పండింది
పేదవారి ఆశలట్లు
మోదుగు పూచింది.....

శ్రుతి తప్పిన బ్రతుకు వీణ
శ్రుతి చేసెను కోకిల
ప్రతి ఎద ఇందిందరమై
పాడె ప్రగతి గీతిక .....

కూడి యున్నవారి మధ్య
గోడలెందుకన్నది
దవ్వులగల జాబిలి
తన దరికి చేరుమన్నది.....



## ఆశల ఉగాది

వచ్చె ఉగాది, వచ్చె ప్రతి
        వత్సర మట్టులనే వసంతమున్
తెచ్చెను, వృక్షముల్ లతలు
        నిర్మల పల్లవ పుష్ప శోభతో
ముచ్చటగొల్పె, కోకిలలు
        మోహనరాగము లాలపించగా
పచ్చని మామిడుల్ కనుల
        పండువుగా కుసుమించి కాచెగా !

మామిడి పూచినట్లు మధు
        మాసము హాసము చేసినట్టు లా
రామములోన కోకిలలు
        రాగము లల్లిన యట్లుగా, కవి
స్వాములు ఈ ఉగాది దొర
        సానికి స్వాగత గీతులల్లు టిం
కేమిటి కన్న నేను కవి
        నే అయిపోయితి ఈ ఉగాదికిన్ !

మనిషిని మార్చగల్గెడి స
        మర్థుడు మానవుడేను, కాని ఆ
మనిషియె మానవాళికి ప్ర
        మాదములందు ప్రమాద మయ్యె, ఏ
మనిషి జగమ్ము స్వర్గముగ
        మార్చెడి రాగ సుధామయుండొ ఆ
మనిషియె ద్వేష హాలాహల
        మార్గమునన్ కను నారకమ్ములన్ !

శిశిరమ్ము తలదన్ని శిరమెత్తి నిల్చిన
ఎనలేని వనరమ ఈ ఉగాది
కంటకాలను పూలమంటల గాల్చిన
హేలావిలాసిని ఈ ఉగాది
బెల్లమే మామిడి పిందెయే వేప పూ
వే గొప్పయని చెప్పు ఈ ఉగాది
ఎండనాగుల బారినుండి లోకమును ర
క్షించు ప్రపాబాల ఈ ఉగాది

గున్న మావులవలె పేద గుండె లన్ని
పూచినవి నేడు ఆశల పూలు, కలలు
పండుచో వచ్చెడి ఉగాది పండుగను మ
హా వసంతుడనై కళ్ల కద్దుకొందు.

...



# కార్మోన్ముఖి

కోకిల పాటలు వినే
కోరిక లేదు
తారల ఆటలు కనే
తీరిక లేదు –

ప్రగతి నోట మనిషి గెలుపు
పాట వినాలి
బడుగు బ్రతుకులందు, సిరుల
బాట కనాలి –

తరుల మీది విరుల జూచి
మురియజాలను
శ్రమజీవుల కనుల తనివి
సరులు కనాలి –

సైకతాల విహారాల
శాంతి కలుగదు
సమసమాజ జీవితాల
సౌరు కనాలి –

తలిరు గాడుపుల నా మది
పులకరించదు
సకల జనుల సుఖ తరంగ
శ్రుతులు వినాలి –

...



# విజయ వసంతం

వచ్చింది వచ్చింది
వాసంతము
వాసంతమూ - విజయ
భాస్వంతము -

మన జాతి మోమువై
మార్పు సుమహాసమై
మనదేశ రథముపై
మంగళ పతాకమై - వచ్చింది వచ్చింది ......

పచ్చ పచ్చని చేల
పైట సవరించుకొని
తరుణ భారత చరిత
తలనిండ ముడుచుకొని - వచ్చింది వచ్చింది ......

కొండ కోనలలోన
క్రొత్త గొంతులు మీటి
చీకు చింతల వెతల చీకట్ల నెగదాటి - వచ్చింది వచ్చింది...

పాడిపంటలు కూర్చి
పరిశ్రమలు తీర్చి
ప్రతిపల్లె ప్రేపల్లె
పగిది చిత్రించుతూ
వచ్చింది వచ్చింది వాసంతము.....

•••

# మధుమాసం గర్జిస్తూంది

మార్పు జండా పట్టుకొని
మధుమాసం గర్జిస్తూంది
శైశిర పాశవ శక్తుల మీద
చైతన్యచైత్రరథం
జైత్రయాత్ర సాగిస్తూంది.

కుతంత్రాల కొండల మీద
కుమిలిపోతున్న కాశ్మీరమా
కష్టాల కడలి ఒడిలో
కలవరిస్తున్న కన్యాకుమారీ
అనుమానాల అడవుల్లో
అసహాయతల లోయల్లో
అలమటించే భారతీ
ఈ ఉష్ణరక్త వాసంతంలో
నవయుగ గీతి ఆలపించు !
విప్లవజ్యోతి వెలిగించు !

అదుగో!
ప్రజాశక్తి పల్లవిగా
ప్రగతిగేయాలు పాడుతున్నాయి
పరభృతాలు,
కాలం కన్నుల్లో
ఆశాపలాశ దీపాలు వెలిగించి
రాలిపోతున్నాయి

నేలతల్లి ఒడిలో
త్యాగం పండిన పత్రాలు
కులతత్వపు కోరలతో
మతోన్మాద మారణాస్త్రాలతో
మనిషి రక్తాన్ని పీల్చే
రక్తాశనులు, రక్కాసులు
తల వంచుక వెళ్ళిపోవాలని
ఘోషిస్తున్నాయి
బాధాతప్త క్రోధోద్రిక్త పక్షిబృందాలు
విజ్ఞాన ప్రజ్ఞానోద్దీప్త మాకందాలు
మలుపు తిరుగుతున్న భారత చరిత్రకు
ప్రాణం పోస్తున్న భావగంధాలు.

నల్లధనపు నాగుబాముల
నాటకం కట్టించే నాయకత్వంపై
మల్లెలు కురిపించే నవవర్షం ఇది
దేశద్రోహి దివాంధాలను
పసికట్టి మసి చేస్తున్న
ప్రచండ కాంతివర్షం ఇది
అవకాశవాదమే వినోదంగా
అటూ ఇటూ దూకే
గోడమీది పిల్లులకు
సంకటమైన కంటక వసంతం ఇది -

ఆస్తిపాస్తులున్న వాళ్లు
ఆస్తికులై పోతూంటే
అవేవీ లేనివాళ్లు
నాస్తికులై వాపోతుంటే

"తత్వమసి, త్వమే వాహం"
తత్వాలు బోధపడక
తల్లడిల్లే వెర్రిమనిషీ !
ఎక్కడున్నావు నీవు !
సంకుచితత్వాల స్వార్థపరత్వాల
దోపిడిలో
దానవత్వాల దాస్యతత్వాల
రాపిడిలో

నీకు దాపురించిన
నిరీహ నిర్బల రూపాన్ని వదుల్చుకో
నిర్వేల కుచేల తాపాన్ని విదుల్చుకో
వాడిపోని అందాల, వీడిపోని ఆనందాల
వలువలూ విలువలూ ధరించి
క్రొత్త ఉగాది పండుగ చేసుకో !
చేదు సత్యాలు సేకరించు
తీపి తీపి మాయలన్ని అందులో కరగించు
ఉపనిషత్సారంలో వాటిని మేళవించి
ఉగాది పచ్చడి చేసుకొని
ఉజ్జ్వలంగా సేవించు !
మనిషినే మాధవుణ్ణి చేసే
మార్పు మంత్రం పఠించు !

మనిషీ !

కదంత్రొక్కి కదలిరా

జీవ జవసత్త్వాలకు జయజయనాదమై రా

అభయ భావినభంలో

శుభోదయమై రా

నిజంగా నీవు పరమాత్ముడవే

నీ శక్తి నీవు గ్రహిస్తే

రోదనం మాని దుష్టత్వంపై

క్రోధనం వహిస్తే

•••

## గడుసరిమావి

ఎంత గడుసరిమావిగున్న
ఎండలను ఎదిరించే నన్నా!

కోయిల గళాలతో
క్రొత్త పాటలు త్రాగి
రసకేతనము లెత్తి
రాగిల్లిపోయినది -

అంబుధుల గుండెలే
అవిసిపోతుంటేను
మంచుమల కండలే
మరిగిపోతుంటేను
గాలి గజగజలాడి
పారిపోతుంటేను
చేర్చి తన నీడలో
సేద దీర్చిన జాణ -

భయము లేకున్నచో
బాధలే లేవురా
చల్లని రసాల వని
సందేశ మిదిరా -

...



# ప్రమాదాల ప్రమోద

నిరాశలకు నిట్టూర్పులకు
మరుపు పూల రంగులు పూస్తూ
అపజయాల ఆవేదనలకు
కోకిల మధురాలాపాల
మత్తుమందు పోస్తూ
ప్రాణాలు పోతున్న వాళ్లకు
పంచాంగాలు వినిపిస్తూ
వేపచేదు నిజాలకు
తీపి బెల్లం తినిపిస్తూ
వచ్చింది
ప్రమాదకర మధుమాసం
ప్రమోద దాతనంటూ.

ఉగాది పేరు చెప్పుకొని
ఊళ్లో వాళ్లందరి చేత
సన్మానాలు చేయించుకుంటున్న
ఈ సంవత్సరాదిని నమ్మను
అసలు రంగు తేలేదాక
ప్రశంసల అత్తరులు చిమ్మను –

పై పై పూతలు చూచి పళ్లికిలించే
సగివాణ్ని కాదు నేనిప్పుడు
కుహూ కుహూమని కూసేవన్నీ
కోకిలలే అనుకొని మురిసిన
అమాయకుణ్ని కాదిప్పుడు

గున్నమావికీ ఎండమావికీ
తేడా గుర్తించలేని
గ్రుడ్డివాణ్ణి కాదు నేనిప్పుడు
మండే లావాలో 'మండేలా' ఉంటాడని
మర్మాలు తెలుసుకుంటున్న
మార్తాండుణ్ని నేనిప్పుడు
స్వదేశ భక్తిని విదేశ శక్తులు
సరిహద్దులో ఎలా ఖరీదు చేస్తున్నాయో
గ్రహిస్తున్న బుధ గ్రహాన్ని నేను ఇప్పుడు
చీకటి మబ్బుల ఖాతాల్లో
దాచుకుంటున్న మోసాలను
పసికడుతున్న చంద్రహాసాన్ని నేనిప్పుడు
అందుకే
వాదాలకు ఉన్మాదాలకు మధ్య దూరాన్ని
మిధ్య చేస్తున్న అద్వైతులకు
దూరంగా ఉంటున్నాను
సత్యాన్ని హత్య చేయడానికి
సాధనాలు ఎన్ని ప్రయోగిస్తున్నారో
తెలిసికొని కనులు తెరచుకొన్నాను
భద్రత కోసం నిద్రమాని
అనిమిషున్నై పోతున్నాను.

●●●

# ఆశావాది ఉగాది

రమ్మన్నా వద్దన్నా
వస్తుంది ఉగాది
తెమ్మన్నా వద్దన్నా
తెస్తుంది ఆశల వసంతాన్ని -

మోడుబారిన చెట్ల గుండెల్లో
చైతన్యం ఆరిపోలేదు
ఎండిపోయే గాలి గొంతుల్లో
ఆవేశం రాలిపోలేదు
పగిలిపోయిన పాతకడవ లోని
పాయసం
క్రొత్త కుండలో కూడా ఉంది అంటూ
నిత్య సత్యాలనూ, నిగూఢ తత్వాలనూ
రంగరిస్తూ వచ్చింది ఉగాది
రమ్మన్నా వద్దన్నా వస్తుంది ఉగాది

రాళ్లలో చిక్కుకున్న శిల్పాలు
బయటపడే కిటుకు తెసుకుంద ట
బీజంలో పడిపోయిన భూజం
గట్టెక్కే గుట్టు కనుక్కుందట
పేదరికాన్ని పిండిపోస్తున్న
(దో) పిడికిలిని
చిత్తు చేసే సత్తు తనకుందట

దురాశా నాగసర్పాల
నల్లతలల ఖాతాల్లో దాగిన
విలువలేని రత్నాల నిలువర్ని
వెలికితేసే విద్య నేర్చుకుందట
మరి, ఈ ఉగాది
మామూలు పచ్చడి పండుగ కాదట
శైశిర పాశవ శక్తులకు
చరమగీతం పాడే చైత్రోదయమట -

అరణ్యంలో అల్లాడే అజ్ఞాతవసంతాన్ని
జనారణ్యంలోకి రమ్మంటూంది
గట్లమీద కాదు
ఓట్ల చెట్ల మీద కూర్చుని
మార్పు గీతా లల్లమంటూంది
కొండల్లో కాదు
ప్రజల గుండెల్లో పాడుమంటూంది
తుపాకి గుండ్ల నెత్తురు పాటల్లోని
త్రుప్పుపట్టిన విదేశి బాణీలతో
విసిగిపోతున్న స్వదేశానికి
శాంతి విప్లవం ఇమ్మంటూంది -

అవును, ఆశోన్మాది, ఆలోచనవాది, ఈ ఉగాది
అందుకే
ప్రమాదభరిత వాతావరణంలో నుంచి
ప్రమోదభరితనంటూ వచ్చింది
వస్తూ వస్తూనే ఈ వసంతానికి
క్రొత్త వన్నె తెచ్చింది -

ఈ వాణి భాషలో, భావంలో
సద్యోజాత పరిమళాలు గుబాళిస్తున్నాయి
గర్జించిన గాండ్రించిన,
పర్జన్య శంఖాలు పూరించిన
సాయుధ రక్తపాత విప్లవాలూ
సమత పేరుతో స్వేచ్ఛను చంపిన
అరుణావేశ సమాజాలూ
చేసిన తప్పు ఒప్పుకుంటూన్న
తరుణాలోచన ఈ ఉగాది
చేదు నిజం ఈ ఉగాది -

ఈ ఉగాది మోసుకొచ్చింది
భయం కాదు - అభయం
ఈ ఉగాది ప్రబోధించేది
సిద్ధాంత బుద్ధి కాదు, త్రికరణ శుద్ధి
చిలుక పలుకులు కాదు - స్వతంత్రాలోచనా శక్తి
ఇజాలు కాదు, బ్రతుకు నిజాలు
సంహరణం కాదు - సంస్కరణం
మరణం కాదు - మార్పు

...



# మధుమాసంలో మోసం

మోసం మధుమాసంలా
వేషం వేస్తుందనుకోలేదు
ఆశల కాశ్మీరానికి
అగ్గిపెడుతుందనుకోలేదు
రాగాలు విరిసే మంచుమలకొమ్మ
రక్తాలు పూస్తుందనుకోలేదు
అమృతం పంచవలసిన
ఐదు నదుల వ్రేళ్ల హస్తం
అమాయకుల కుత్తుకలు
కోస్తుందనుకోలేదు
మృత్యువుతో నేస్తం చేస్తుంచనుకోలేదు -

అడవులారా! కొండలారా!
అజ్ఞాతపు లోయల గుండెలారా!
ఈ విద్వేషపలాశ కుసుమ హాసం నమ్మకండి
ఈ మధుమాసపు మోసంలో పడకండి
మనిషిని చంపి మనిషిని బ్రతికిస్తామనే
మాయలో చిక్కకండి
అడిగితే కూడా పెట్టదనే అపోహతో
అమ్మ రొమ్ము చీల్చకండి!
ఓట్ల చెట్ల మీద పూయవలసిన పూలు
బుల్లెట్ల మీద పూస్తాయా!.
సదాలోచనలకు సాధ్యమయ్యే వెలుతురు
దురావేశానికి దొరుకుతుందా!
పికాల బాకాలు చిలికే స్వరాలు
తుపాకి గుండ్లు పలికిస్తాయా!

పుస్తకాలలో ఉన్నదంతా
వాస్తవమే నని విశ్వసించి
మీ మస్తకాలు పాడుచేసుకోవద్దు
వాదాలకు ఉన్మాదాలు బోధించే
వసంతాలు మనకువద్దు
వేదవాదాలకు, నినాదాలకు
ముడివేసే
వివాదాలు మనకువద్దు -

రాళ్ళల్లో చిక్కుకున్న
మన సుందరస్వప్న శిల్పాలు
బ్రద్దలు కొడితే బ్రతకలేవు
భయపెడితే బయటికి రావు.

నేటి ప్రపంచం వినిపించే
పంచమస్వరం - శాంతి
నేటి సమాజం చిత్రించే[illegible]
ప్రగతి వర్ణం - సహనం
నేటికాలం ప్రతిపాదించే
కార్యాచరణం - సంస్కరణం
అందుకే
సత్యమార్గంలో సాగిపోయే
మన ఆశల ఆశయాల రథానికి
కట్టండి "అహింసా హంస" కేతనం
నిలబెట్టండి మన నిత్య[illegible]

•••

# ప్రగతివాద పక్షులు

కంటకాల నెదిరించే
కథ చెబుతూంది గులాబి
మంటల నార్పే గాన
మధువు చిందుతూంది మావి -

శైశిర పాశవ శక్తుల
చెండాడేటట్లుగా
చేయును గీతాబోధ
కోకిల వేదాంతి -

జైత్రయాత్ర సాగించే
జనశక్తికి జై జై అని
చెట్టు చెట్టుపై చైత్రం
పట్టె మార్పు జండాలు

దోపిడీలు దుండగాలు
పాపా లిక తగ్గునని
పంచాంగం పఠించేను
ప్రగతి వాద పక్షులు

చేదు తీపి కలిపి పాడు
శివకోకిల మీ ఉగాది
సమతా నవతానంద
సరస జీవన వినోది -

...



# ఉగాది ఊహలు

ఉదాసీనముగ వచ్చే ఉగాదిలక్ష్మి
నిజంగానే కలుగుతూంది నీపై జాలి

వచ్చావో లేదో, ఏమి
తెచ్చావని అడుగుతారు
కొమ్మకొమ్మలో దాగిన కోకిలమ్మలు
బడిబడిలో గుడిగుడిలో బాపనయ్యలు --

ఏటేటా పేరుమార్చి
ఎలా నీవు వచ్చావో
ఊహాకల్పనలు చేసి ఉవ్విళ్లూరిస్తారు
సమయస్ఫూర్తి కలిగిన
సంప్రదాయులు
పచ్చడికే ముచ్చటపడు
పండితవరులు--

ఏ పేరున ఏ తీరున
ఏ పరువము తెచ్చినా
పాతచింతకాయ పచ్చడి వని తిడుతారు
అభ్యుదయుల మనుకొనే
అల్లరి కవులు
అసంతృప్తులు కుపితులు
అధునాతనులు --

నిన్ను ఎలా వర్ణిస్తే
నిజమౌనో ఋజువైనో
ఎరిగించుము నీవే హే ! కాలాక్షీ
లోకజనానందముగా ఓ లోలాక్షీ !

# కాలచిత్రం

తిరిగి తిరిగి అరిగిపోయిన
అరవై సంవత్సరాల పేర్లు
మార్చాలనుకుంటున్నాను
ఈ ఉగాది శుభముహూర్తాన -

పచ్చ పచ్చగా వచ్చిన వసంతంతో
వెచ్చ వెచ్చగా చర్చించి
శుకాలతో, పికాలతో
సుందర ప్రసూనాలతో
సంప్రదించి,
క్రొత్త, పేర్ల జాబితా
చిత్తశుద్ధిగా తయారుచేసి
ప్రజామోదం కోసం
పట్టుకొని వచ్చాను--

పేరు మారితే
తీరు మారుతుందా అని
పెదవి చప్పరించవద్దు
"పేరులో ఏమున్నది పెన్నిధి"
అని అన్నవాడి పేరేమిటో కాని
పేరు కోసమే కదా
మన పెనుగులాటలన్నీ

కాలం కడుపులో పుట్టిన
లీలా రూపాలకు
పెట్టుకొనే ఆ పేర్లేమిటో
ముద్దు ముచ్చటగా పెట్టుకోక
దుర్ముఖి, దుర్మతి అని
రాక్షస, రక్తాక్షి అని
విరోధి, వికృతి అని
ఖర, పరాభవ అని
క్రోధి, వికారి అని
కర్ణ కఠోర
అమంగళ, అపభ్రంశ నామాలు పెట్టి
అందాల కాలదేవతను
అవమానించడం
అపరాధం కాదా అంటున్నాను--

"గంగి గోవు పాలు
గంటెడైనను చాలు" అన్నట్లు
కంపు కొట్టే అరవై పేర్లకంటే
ఇంపుగా ఉండే ఇరవై చాలవా !
ప్రభవ, విభవ, యువ వంటి
పాపులర్ పేర్లు కొన్ని అలాగే ఉంచి
ప్రజోత్పత్తి, వంటి వాటిని
'ప్రజా నియంత్రణ' గా సవరించి
సాధారణ నామాలకు బదులు
అసాధారణాలు చేర్చి

శ్రవణపేయంగా
భువన మోహనంగా ఉండే
రసవద్వసంతాలతో
రచిస్తున్నాను
రాబోయే కాలచిత్రాన్ని
జన జీవన పత్రాన్ని
ఈ సంచలన చిత్రం
మానవ చరిత్రలో ఒక మలుపు
మనిషితో మైత్రికై దేవుని పిలుపు --

●●●

# కాకిగోల

కోకిలలు చిందిస్తున్న పాటల్ని
కాకులు పరీక్షిస్తున్నాయి
పువ్వులు కురిపిస్తున్న నవ్వులకు
బండరాళ్ళు విలువకడుతున్నాయి
"కోహం" అని ప్రశ్నిస్తూ
"సోహం" అని ప్రవచిస్తూ
సాగిపోతున్న సత్యాన్ని
సమతా సాహిత్యాన్ని
రంకు బొంకు కాకులు
చీకాకులు పెడుతున్నాయి
సరసభావ వసంతాలను
విరసాలు నిరసిస్తున్నాయి -
అవును
గుండె మావుల గుబాళింపులు
ఎండమావుల కెలాతెలుస్తాయి ?
కొసరి కొసరి పాడే కోయిల విలాసాలు
గ్రుడ్డి కొంగల కెలా తెలుస్తాయి
నింగిలో తేలిపోయే మబ్బుల్ని చూచి
బావిలోని కప్పలు గోల చేస్తే
గాలిలో తూలే పూల బ్రతుకుల్ని
రాలురప్పలు గేలిచేస్తే
వన్నెతరిగే దెవరికి ?


గగనంలోని నక్షత్రాలకంటే
గాజుపెంకులే పెద్దవని
వాదించే కాకులు
వైతాళికులుగా వెలిగినంత మాత్రాన
అసలు వెలుగు ఆరిపోతుందా !
...

# కొలువు కెక్కిన క్రొత్తవత్సరం

తిరిగి తిరిగి వస్తున్న
తెలుగు సంవత్సరాలు
కాలానికి పహరాకాస్తున్న
కానిస్టెబుల్సు -
పంచాంగం యునీఫారం వేసుకొని
ప్రథమ చైత్రంనాడు
వసంతానికి ఒకరు
వస్తున్నారు డ్యూటీపైకి -

తిథి, వార, నక్షత్రాలు తింటూ
ఆరు ఋతువుల చక్రంతో ఆడుకొంటూ
ప్రభవ, విభవ, శుక్లాది
అరవై మంది సిపాయీలే
అక్షయపటాలాలుగా
అవతరిస్తూ పోతున్నారు -
ఒక ఏడు డ్యూటీ చేసి
యాభై తొమ్మిది ఏళ్ళు
ఆర్నడ్‌లీవు తీసుకుంటారు
ఎంత అద్భుతమైన సర్వీసో
ఈ పరవాలేని పరువాల
అరవై వసంతాలది -

ఐ.సి.ఎస్., ఐ.పి.యస్.
ఏ సర్వీసు అయితేనేమి
ఎందుకూ కొరగావు
ఈ
టి.వై.యస్ (తెలుగు ఇయర్స్ సర్వీస్) ముందు
అసలైన ఆలిండియా సర్వీసు ఇది

ఎవరు సృష్టించారోగాని
అనుపమాన సర్వీసు ఇది
ఒక్కసారి రిక్రూటుమెంటు అయితే
యుగ యుగాల దాక
రిటైర్‌మెంటు లేని
ఇటర్నల్ సర్వీసు ఇది -

ఎన్ని ఊర్లు మారినా
ఎన్ని పేర్లు మారినా
ధరిత్రి మారినా
చరిత్ర మారినా
మారని మహారాజులు
మన టి.వై.యస్. అధికారులు.

కొలువు తిరిగి రుదిరోద్గారి
వెళ్ళిపోతున్నాడు
మర్యాదగా వీడ్కోలు చెప్పండి
మళ్ళీవస్తాడనే మాట మరవకండి
రాజాధికార దండంతో విచ్చేసిన
రక్తాక్షికి
స్వాగతం చెప్పండి అందరూ
సంవత్సరాదినాడు
ఈ ఉగాది నాడు.

•••

# ప్రజోత్పత్తి

వచ్చినావా ప్రజోత్పత్తి వత్సరుండ !
చేసినను ఏది, ఏదియు చేయకున్న
చేయబోకు ప్రజోత్పత్తి, చేయబోకు
దిక్కులేని జనోత్పత్తి దేశమందు --

ఉత్పత్తి చేసెడి యుక్తి నీకున్నచో
　　సిరిసంపదలు పెంపు చేసి చూపు
ఉత్పత్తి శక్తి నీకున్నచో ఇంటింట
　　పాడిపంటలు వృద్ధి పరచి చూపు
ఉత్పత్తి చేయుధీయుక్తి నీకున్నచో
　　పలు పరిశ్రమల ఉత్పత్తి పెంచు
ఉత్పత్తి వ్యూహ ప్రయోగమ్ము లెరిగిన
　　చెట్లు, గృహాలు సృష్టించి చూపు

పేరునకు తగినట్టుల; వృద్ధి చేయ
వలసి యున్నచో పెంచుము ప్రగతి మతుల,
ధైర్యవంతుల, విజ్ఞాన ధనుల, త్యాగ
శక్తి పరులను జన్మభూభక్తి పరుల.

•••



# భూమిని ప్రేమిస్తున్నాను

అగాధమైన జీవిత సత్యాలను
ఉగాదినాడు శోధిస్తున్నాను
నే పుట్టిన పుడమిటింటి
కట్టడుల కడపదాటి
హద్దులులేని అడ్డులులేని
ఆకాశంలో విహరిస్తున్నాను
కోహం ! కోహం ! అంటూ
కోకిలమునై పాడుకొంటూ
విజ్ఞాన శుక్ల వసంతాన్ని
ప్రజ్ఞాన శిఖరాల మీదికి
పట్టుకు పోతున్నాను --

మనుషులకోసం పుట్టిన
మట్టిగోళం మీదనే
పదే పదే జన్మిస్తున్న
పరమాత్ముని విలాసంకోసం
అంతరిక్షవీధుల్లో
అక్షరాలా వెదుకుతున్నాను
సోహంలో ఉన్న అత డెవరో
అహంలా ఉన్న నేనెవరో
తెలిసికోవాలని
చైతన్య చైత్ర శకటంలో
జైత్రయాత్ర సాగిస్తున్నాను
అగాధమైన జీవిత సత్యాలను
ఉగాదినాడు శోధిస్తున్నాను--

మట్టిగోళం వట్టిదే అయితే
మనిషి బ్రతుకు మాయే అయితే
మహినీ మనిషినీ రక్షించడానికి
మిధ్యా రాక్షసుల్ని శిక్షించడానికి
అన్నిసార్లు ఆ భగవంతుడు
అవతారా లెందుకెత్తాడో
అవగాహన చేసుకుంటున్నాను
అసలు కిటుకు తెలుసుకుంటున్నాను
అగాధమైన జీవిత సత్యాలను
ఉగాదినాడు శోధిస్తున్నాను --

మతాలనూ హితాలనూ
ప్రబోధించే మహాత్ములను
పాపాలకు దోపిడీలకు
పాలుపడే దురాత్ములను
ప్రక్క ప్రక్కనే సృష్టిస్తున్న
పరమాత్మతత్వం కనుక్కుంటున్నాను
అర్థం తెలియని జీవితపు
పరమార్థం కనుక్కుంటున్నాను --

ఇహలోకంలో పుట్టడం
పరలోక ప్రాప్తికోసమే అయితే
ఇహపరాల మధ్య దూరం
ఎంతుందో కనుక్కొంటున్నాను
సరాసరి అక్కడే పుట్టే
సదవకాశం వెదుక్కుంటున్నాను
అది మాయో, ఇది మాయో
ఏది మాయో, ఏది నిజమో
ఎరిగే మార్గం చూస్తున్నాను
అగాధమైన జీవిత సత్యాలు
ఉగాదినాడు శోధిస్తున్నాను --

ఈ భూమికి ఉన్నలోపం
ఏమిటో అడుగుతున్నాను
సురలోకంలో ఉన్న సౌఖ్యాలు
నరలోకంలో ఎందుకు సాధ్యం కాదో
సమాచారం సేకరిస్తున్నాను
అక్కడా ఇక్కడా అధికారం చేసే
ఆదిదేవుడు ఒక్కడే అయినప్పుడు
పక్షపాతం ఎందుకో అని
పరిశీలన చేస్తున్నాను
అగాధమైన జీవిత సత్యాలను
ఉగాదినాడు శోధిస్తున్నాను --

వేడి వేడి ఆలోచనల, అనుభూతుల
గాలిలో స్నానమాడి
చివురిస్తున్న ఆమని చెలిమి చేలాలు కట్టుకొని
సమదర్శనం పరిమళించే
శక్తి పూల జండా పట్టుకొని
శ్రీకార శంఖం పూరిస్తున్నాను
సూర్యచంద్రుల కిరణాటక సంగీతంలో
సుందరానందనృత్యం చేస్తున్న,
నాప్రబుద్ధాత్మకు ప్రాణమిచ్చే
భూమిని ప్రేమిస్తున్నాను
అగాధమైన జీవిత సత్యాలు
ఉగాదినాడు శోధిస్తున్నాను.

•••

# తిరుమలపై ఆమని

ఏడుకొండల గుండె వెలుగు జండాలెత్తి
చైత్ర జైత్ర రథమ్ముపై వచ్చెను ఉగాది
సకలవరవితరణ వినోది గోవిందునకు
ఆత్మానురాగ బృందావన విహారునకు
అభ్యుదయవాసంతికాంజలి ఘటించినది --

అజ్ఞాన శిశిర బాధాతప్త జీవులకు
ప్రజ్ఞాన మాకంద ఫలము లందించినది
మట్టి ఘటములలోన, మాయల హరియించు
సత్యసుమసారమ్ము సొంగమ్ముగా నింపి
పంచిపెట్టెను భిష్మణియై ఉగాది
లోకకళ్యాణకారిణి కాలవేది --

కోహమని సోహమని క్రొత్త కోకిలమేదొ
కొసరి కొసరీ పాడె కొమ్మ కోవెల మీద
చెట్టుచేమలు కూడ శ్రీకారములు చుట్టి
రాలురప్పలు కూడ పూల గొడుగులు పట్టి
పరవశముతో జరుపుకొను వసంతోత్సవము
దేశకాలాతీత గీతికాధ్వరము
ఏడుకొండల గుండె వెలుగు జండా లెత్తి
చైత్ర జైత్ర రథమ్ము పై వచ్చెను ఉగాది --

ఆబాల గోపాలమీ సుప్రభాతాన
గొడుగొడవల పుట్టములు వదులుకున్నారు
సరస సౌందర్య సుశ్లోక బంధురమైన
క్రొత్త విలువల వలువలను తొడుగుకున్నారు
ఉత్తిష్ఠ ఉత్తిష్ఠ గానోత్థితాత్ములై
రామ రామారామ రమ్య శుకపికములై
నిగమాగమానంత నీలానుభూతిలో
వినిపించు ప్రణవవిప్లవ వేణు నాదాలు --

కలల మెట్లెక్కి శంకల మబ్బులను దాటి
చిదమలాకాశగంగాస్నానమొనరించి
భక్త కోటులు ఆత్మశక్తి సంపన్నులై
ముక్త నక్షత్రాలవోలె భాసించేరు
తిరుమల శిఖరాలపై తీర్థమాడేరు
మోదమోదక ప్రసాదము లారగించుచు
భవభయరహిత శివంకర ఋతంభరమైన
అక్షయానంద పంచాంగము పఠించేరు.

●●●

# గట్టు గట్టున గంధాలు

వచ్చినావా తిరిగి
వాసంతలక్ష్మి !
తెచ్చినావా మరల
తేజోవనాలు –

చెట్టు చెట్టున మల్లి
చిరునవ్వు విరిసె
గట్టు గట్టున తిరిగి
గంధాలు కురిసె –

ఢిల్లీలో ఆశలు
హెూరి ఆడినవి
పల్లెలో కలలెన్నో
పల్లవించినవి –

వేప పూవుల పిలిచె
విందునకు బెల్లం
చింతపండును వలచె
చిరుమావిపిందె –

నీ పలుకు తోటలో
నిలిచింది కాలం
నీ కీర్తి పాటలో
కరగె పికజాలం – ...



# సుషమ కుసుమవని

సుషమ కుసుమవనిలో
రసధునినై పోనా
తరుణ భావసాగరాల
తరంగమై పోనా !

పూచిన ప్రతి పూవులో
తోచును ఆనందరోచి
పరవశించు గాలిలో
పరిమళించు ఆత్మీయత

చిరునగవే చేలముగా
స్థిరచిత్తమే శీలముగా
పరసుఖమే భాగ్యముగా
బ్రతికే పూలకు నమస్సు

ఓరిమి కూరిమి పెంచే
ఉద్యానమే నా కోట
విహగాలకు పాట నేర్పు
విరులతోట నా బాట,
రావే! చెలి నా జీవన
ప్రణయారామమువై
పాడవే! నా భావ
పారిజాతవిటపివై -

•••

# నిదుర లేచిన పూలు

నెదరులాండులో నేడు
నిదురలేచినవి పూలు
నిదురలేచి నిదుర లేపె
ఎద ఎదలో పరిమళాలు

తొలి వలపుల ట్యులిప్ పూలు
పలు వన్నెల గులాబీలు
రూపవతులు డ్యాఫడీలు
దీపించె వసంత వేళ -

పూబోడుల మధురోహల
పులకరించె మట్టినేల
కైపెక్కి పూరాలు తేలె
కార్నివాలు సంబరాల -

కోమల "సుమబాల"లంత
"కుకెన్ హోఫ్" లో కూడిరి
పూ విల్తుల మతిపో
నానా విధ నాట్యము లాడిరి-

తీగెల నగవులు పూవులు
పూవుల వలపులు తావులు
పూవులు తావులు నీవే
జీవితవన నాద సఖీ !
చిరవసంత హాసముఖీ !

●●●

# అభినవ భగీరథ

మండే ఈ ఆమని లోనికి
గుండె గాజు గుండా చూస్తున్నాను
భయంకరమైన ఈ అజ్ఞానపు కొండల్ని
నామేధా మండలాన మండిస్తున్నాను
ఉండడానికి నీడ లేక
లావా కొండపై నుండి మండి పడే
శిలా ద్రవానికి
భూగర్భంలో స్థలం కల్పిస్తున్నాను -

ఈ నిశా శైలాంత గృహాంతరంలో
ఉషోరేఖల్ని చెక్కుతున్నాను.
మండే జీవితాల గుండెలు చితికిపోయి
కళ్ల లోయల గుండా
ఏళ్లుగా పారే కన్నీళ్ళను
సమతాభ్యుదయ చంద్రుడు ప్రతిబింబించే
శాంతి సుఖార్ణవంగా మలుస్తున్నాను -

చుక్కల కన్నెలకూ
విరహంతో స్రుక్కుతున్న మిత్రులకూ
మేఘాల పందిళ్లలో
చందమామ పెళ్ళిపీట మీద
మలయ పవనుడు మంత్రం చదువుతుంటే
ప్రేమలు ముదరక మునుపే
పెళ్ళిళ్లు చేయిస్తున్నాను -

శిశిరాన్ని
నా భానిసగా వశం చేసుకుంటున్నాను
వసంతానికి
శాశ్వత వాసం ఏర్పరుస్తున్నాను
చింతకాయలు రాల్చే సంగీతం సృష్టిస్తున్నాను
అంతా సంతోషంగా బ్రతికే తెరువు చూస్తున్నాను.

# ఆకలి లేని కోకిల

భూమిమీద పుట్టిన
బుద్ధి మంతుడ్ని నేను
మట్టిని ప్రేమించే మానవుడ్ని నేను
పుడమిటిల్లు చక్కదిద్దుకునే
పురుషార్థం నాది
అందుకే
పరలోకమనే పొరుగింటి
పుల్లకూర రుచులకోసం
పరుగులెత్తడం మానేస్తున్నాను
ఈ లోకపుసౌందర్యం
ఏ లోకానికి లేదని
మనిషికున్న మహత్తర శక్తులు
మరెవ్వరికీ లేవని
చైత్రోదయ పంచాంగం
చెప్పేస్తున్నాను.
భయాల చీకటి గదిలో
భద్రంగా దాచిపెట్టిన
బూచీల మూటల ముడులు
విప్పేస్తున్నాను --

చిగురిస్తున్న చైతన్యాన్ని
చేలాలుగా కట్టుకొని
పుష్పిస్తున్న సత్యాల
పూలజండా పట్టుకొని
ఆకలి మీద దండెత్తిన
కోకిలాన్ని నేను



చీకటి కడవలో వెలుతురుపోసి
చేదు తీపుల్ని చేరదీసి
బ్రతుకు బాధల నివారించే
ఔషధం తయారుచేసి
ఆబాల గోపాలానికి అందిస్తున్నాను
శుక్లపక్ష విజ్ఞాన ఆకాశంలో
ప్రజ్ఞాన చంద్రికలన్ని
పంచిపెడుతున్నాను.



# లతాంత వేదాంతం

లతాంతం పుష్పం
జీవితలతాంతం బాష్పం
ఎక్కడ పూచినా
పుష్పాలు పుష్పాలే
ఎవరు రాల్చినా
బాష్పాలు బాష్పాలే -

మా ఊరు జడలో విరిసిన
మల్లెపూల పరిమళాలను
మసూరి కొండల గెండెల కురిసిన
ప్రసూన దళాలను
జతచేసిన జానపద గీతాన్ని
వేదనారమ  వినిపించింది
కాలిఫోర్నియా కంఠంలో -

సుమ సావిత్రి
సుందర శివానందలహరిలో
నాడెందం వికసించింది
హాలీఉడ్  కొండ లోయలో
కళాకేళీ  ముగ్ధ నాయికల వలె
చిద్విలాసం చిందే గులాబీల
చిత్ర చిత్ర వర్ణ జగుత్తును
కెమేరాలో బంధించలేక
గుండె కెమెరాలో బిగించాను
ఎక్కడున్నా పూవులన్నీ
ఒక్కటే అన్న సత్యాన్ని
చిత్రంగా చిత్రించాను -

స్వేచ్ఛా స్వాతంత్ర్యాలు
కిర్మీర పక్షులై
తరుల మీద లతల మీద
నిర్భయంగా
తిష్ఠ వేశాయో అన్నట్లు
ఆవర్ణనీయ వర్ణకుసుమాలు !
వాసనా వాసంతాల
విజయ దీపావళి
ఆ అఖండ సుమావళి -
పూల విలువ తెలిసిన
పూర్ణస్త్రీ సత్యభామ
పరమాత్మను కాలదన్ని
పారిజాతాలను వరించింది.
ఒక్క పూలమొక్క కోసం
ఇంద్రలోకాన్ని జయించింది.
జడపూల విలువ తెలియక
ఒకప్పుడు నేనూ
జడభరతుణ్ణయినాను
లతాంత వేదాంతంలో మునిగి నేడు
రసభరితుణ్ణయినాను ।

•••

# కాలవేది ఉగాది

ఉగాది వచ్చిందంటే
ఉలిక్కి పడ్డాను
ఏ ఉగాది ఈ ఉగాది?
ఎదురుగా నిల్చిన
ఏకాంతాన్ని అడిగాను -
ఏ ఉగాది వస్తుందో
ఏ ఉగాది పోతుందో
ఎరుగని
యోగనిద్రా ముద్రితుడవు
నీవెవరవని
కాలవృక్షపు కొమ్మల్లో నుంచి
కలకంఠం ప్రశ్నించింది
వెర్రి సంభాషణ ఇదేమిటన్నట్లు
వేదాంత లతాంతాలు
విరగబడి నవ్వాయి -

వస్తున్నాయి, పోతున్నాయి ఉగాదులు
వస్తున్నాయి పోతున్నాయి ఏడాదులు
ఎన్నికల్లో గెలిచిన నాయకుల్లా
ప్రభవ, విభవ, శుక్ల
ప్రభృతులు అరవై ఓటర్లు;
అయితే
ఓటర్లే కాదు వారు
అభ్యర్థులు కూడా

ఏడాది కొాకరు
ఏకగ్రీవంగా ఎన్నికయి
ఉగాదినాడు
మనల్ని పాలించడానికి వచ్చే
ఉద్దండ నాయకులు వారు.
తరాలు గడిచినా యుగాలు గడిచినా
అధికారం చెలాయించేది
ఆ అరవై మందే
కాలకర్తలు వారు
దేశభక్తులు వారు -

వెళ్ళే నాయకునికి
వీడ్కోలు చెప్పే
వేదాంతులం మనం
మళ్ళీ వస్తాడని అతణ్ణి
మరిచిపోని
వ్యవహార దక్షులం మనం
వచ్చే నాయకునికి స్వాగతం చెప్పే
వంది మాగధులం మనం
అతనిలోని సద్గుణాలు శోధించి
ఆదరించే సహృదయులం మనం -

ప్రభవ, విభవ, విప్లవ గీతాలు పాడే
పరభృతాలం మనమే
జీవనరాగ విరాగాలు పరిమళించే
భావపుష్పాలం మనమే
ఈ వసంతం మనమే
ఈ వనమంతా మనమే
అదుగో వచ్చాడు
చైత్రుడు ! చైత్రుడు
అందరూ అనండి
క్రొత్త నాయకునికి జై
కాలవేదికి జై
ఉగాదికి జై !

•••

# వసంతపరాగము

మలయసమీరమన్న మధు
మాసములన్న, పికమ్ములన్న, వె
న్నెలలు, మొయిళ్లు, తారకలు
నిర్ఘరులన్నను తన్మయుండనై
శిలలు కరుంగునట్లు, పెను
చీకటులెల్ల వెలుంగునట్లు, నా
కలలు నిజమ్ము లౌనటుల
గానముసేతు రసానుభూతులన్

***

ఏను వసంత వాటికకు
నేగి ప్రమోదము చెందకుండ, ద్వే
షానలచిత్తు లెవ్వరో న
నడ్డెదరౌర ! ఎరుంగలేక - నా
లోనె వసంతలక్ష్మి ఎద
లోని ఎదన్ వలె నాట్యమాడి, అ
మ్లాన మహానుభూతి సుమ
మంజరులన్ రచియించి మించుటన్

***

కుహూ కుహూ మని కూసే కోకిల ఏమంటున్నది
ముద్దుల సంసారానికి ఇద్దరేను పిల్లలట
కుహూ - కుహూ
ఝుమ్మని ఝుమ్మని పాడే తుమ్మెద లేమంటున్నవి
ప్రణయ దంపతుల కడుపు పంట ఇద్దరేనంట
ఝుం - ఝుం.

***

కొమ్మలలో కోకిలమ్మ
కుహూ కుహూ మన్నదే
నిన్ను నన్ను జంటకూడి
నేడే రమ్మన్నదే!

***

ఎచ్చట చూచినన్ సుమము
　　లే, సుమకోమల బాలలే, సిరుల్
విచ్చిన జాడలే, మధువు
　　వెచ్చదనమ్ములు పంచువాడలే
పచ్చిక బీడులే, ఘటని
　　భస్తన గోవుల మందలే ఒహో
అచ్చరలుండు స్వర్గమిది
　　యాయనిపించెడి వింతనేలలే

***

గుండెలోని కోరికా
కొమ్మమీది శారికా
చదువుకుందాము రావే ఈ తోటలో
పాడుకుందాము క్రొత్త బ్రతుకు బాటలో
పువ్వులు చెప్పే పాఠం పుస్తకాలలో లేదు
కోకిలమ్మ రసరాగం ఏపంతులు నేర్పలేడు
రాలేపత్రాల మీద రాసినాను చదువుకో
చెట్టుకున్న త్యాగము చెలికానికి లేదని -

***

కోకిలా నాపాట కూడ వినిపించుకో
నీ కంఠమే ఎంత దాక మ్రోగింతువే !

***

సంవత్సరమంతా వాసంతమ్మే శోభిస్తే
పిక శుక సంగీతం
కర్ణకఠోర మౌనేమొ !

**

ఉగాదిని ఎగాదిగా చూచి
ఓహో! ఆహోలో పడకు
పచ్చడి మీద ముచ్చట పడి
ప్రశంసాపత్రాలు ఇడకు !

**

ఓ ఆమనీ!
అరణ్యములో నుంచి జనారణ్యంలోనికి రా
ఆవేశంలోనుంచి కాస్త ఆలోచనలోనికి రా

**

కవిత్వాన్ని రాజకీయం చేసే కాకిత్వం పోవాలి
రాజకీయాన్ని కూడా కవిత్వం చేసే కోకిలత్వం రావాలి.

**

గత కాలం
ఆ గత కాలానికి
స్వాగత గీతం పాడుతోంది
ఈ ఉగాది నాడు

**

కోకిలలు పాడగానే
కొమ్మలేవో పూయగానే
కాదోయి వాసంతం
రాదోయి చైత్రరథం

**

కొమ్మ మీది ఓ కోకిలపాట
నా గుండె గూటిలో దూరింది
ఆకులు రాలిన నా బ్రతుకంతా
ఆమనిగా మారింది.

కోహం ! కోహం ! కోహం
అంటూ
కోకిల అడిగింది
సోహం సోహం సోహం
అంటూ
శూన్యం పలికింది
కాలకల్పతరుశాఖల దాగిన
కలకంఠం ఎవరో।
చుక్కల రెక్కల అక్కున
శూన్యాండం ఎవరో !

* * *

రంగులు పూచే చెట్లమీద
రక్తం పూస్తున్నది
కాలమే కంపించి కెవ్వున ఏడుస్తున్నది -

* * *

ఓహో ! ఆహా అనగానే ఉప్పొంగిపోకు
కుహూ కుహూ మనేవన్నీ కోకిల అనుకోకు.

* * *

# ఋతుచక్రధారులు

ఈ ఉగాదికి కవిత వ్రాయను
చేదు తీపి కలిసి చేస్తున్న మాయను
అలంకారాల పల్లకీ ఎక్కించి మోయను
ప్రభవ విభవాది అరవై వత్సరాలో
పంచుకుంటున్న ప్రభుత్వ వారసత్వాన్ని
ప్రశంసిస్తూ పద్యాలు వ్రాయను --

పేరు ఏది పెట్టుకున్నా
ప్రతి సంవత్సరం
పఠిస్తున్న పంచాంగం ఒకటే
పాలిస్తున్న యంత్రాంగం ఒకటే
పాటిస్తున్న మంత్రాంగం ఒకటే--

కోకిల పాటలతో
పూవుల తోటలతో
ప్రత్యక్షమౌతున్న ప్రతి క్రొత్త సంవత్సరం
బాధల మంటలు
బెడదల వరదలు
దుర్మార్గాల హిమపాతాలు
దోపిడీల శిశిరఘాతాలు
యధావిధిగా సృష్టించి
ఏమీ ఎరుగనట్లు నిష్క్రమిస్తుంది

అందుకే,
హాసంతో వచ్చి
మోసం చేసిపోతున్న
ఈ కామరూపక కాలపాలకులను
ఇక నమ్మను
మారుతున్నట్లే మారి
మళ్ళీ మొదటికి వచ్చే
ఈ ఋతుచక్రధారులను నమ్మను
మాయలు
చేసే వాళ్ళు మారడం లేదు
చూసేవాళ్ళు మారుతున్నారు
కాబట్టి
పాత చింతకాయ పచ్చడికి
క్రొత్త తలకాయ ఊగుతూంది
చర్విత చర్వణమైన చరిత్ర
సగర్వంగా సాగిపోతూంది.



పికవధూ ! నీ పాట విను ఓ
పిక రవంతము లేదు నాకిక,
వినదలంచితి విశ్వమానవ
విజయ గీతములు.

ఈ వనాంతర సీమ పూచిన
పూవులను గన తృప్తి గల్గదు.
వేచియుంటిని పేద బ్రతుకులు
విరియు నెపుడంచు.

చైత్రపూర్ణిమ లోన నా ఎద
సంతసమ్మున పొంగజాలదు,
కనదలంచితి శ్రమిక జీవుల
కనుల వెన్నెలలు.

శూన్య గగనములోన మెరిసెడి
చుక్కలం గని మురియ జాలను,
అరయ దలతు కుటీరముల భా
గ్యాల దీపములు.

సైకత స్థల విహారమ్ముల
శాంతి కల్గదు నా మనస్సుకు,
కోరుచుంటిని సమసమాజ వి
హార జీవితము.



ఈ తలిరు గాడుపుల డోలల
నా తనువు పులకింపజాలదు,
ఆశ కలదు ప్రజా ప్రమోదో
చ్ఛ్వాసముల పైన.

ఈ వసంతోదయము గూరిచి
భావగీతులు పాడ లేనిక,
ఈ ధరిత్రి జానావళికి భా
గ్యోదయమ్మెపుడో !

# బాపురెడ్డి గారి కొన్ని ముఖ్య రచనలు ......

బాపురెడ్డి పద్యకావ్యాలు

బాపురెడ్డి గేయనాటికలు

అనంత సత్యాలు

శ్రీకార శిఖరం

నా దేశం నవ్వుతూంది

ప్రేమారామం

మన చేతుల్లోనే ఉంది

పంచ బాణ సంచా

ప్రణవ ప్రణయం

రంగు రంగుల చీకట్లు

మనసులోని మాట

*In Quest of Harmony*

*Longing for Life*

*Urn of Love*

*Loving is Living*

**అనువాదాలు :**

వ్యవధి లేదు

పై కెత్తాలి